శ్రీ బాలకోటీశ్వర

# భజనగేయములు

  

(తొలి పుష్పము)



రచన :

బిం వేంకటకృష్ణారెడ్డి.

శ్రీ బాలకోటీశ్వర

# భజనగేయములు

  

(తొలి పుష్పము)



రచన

బిం. వెంకటకృష్ణారెడ్డి.

శ్రీ శివాయ గురవేనమః

ఖాలకోటీశ్వర

# భజనగేయములు



రచయిత


శ్రీ శీలం బ్రహ్మారెడ్డిగారి ఏకైకపుత్రుడు

**వేంకటకృష్ణారెడ్డి**



ప్రకాశకులు :

కీ. శే. కుడుముల అప్పిరెడ్డిగారి కుమారుడు

**భిక్ష్మారెడ్డిగారు**

మీనవోలు మధిర తాలూకా

**1956**




మూల్యం మూడు అణాలు.



శ్రీ శివాయ గురవేనమః

## కృతిసమర్పణ

ఆ. వె. బాలకోటిదేవ, జాలి, గా పాడుము
జాలమేలజేతు । ఫాలనయన
మేలుముమువజాల । లీలనారచనల
నాలకించినన్ను । నేలుమభవ

కం. ఫాలాక్షుభక్తియుక్తుడ,
శీలము వంశజుడ భక్తిశీలుడనేనున్
బాలుడ గృష్ణారెడ్డిని
మేలగు నీకీర్తిబొగడి మెలగితినీశా !

తే. గీ. భజనకీర్తనలీరీతి, వ్రాసినీకు
భక్తినర్పించుచున్నాడ పాపభంగ
బాలకోటీశ్వరా నీవులీల దీని
నందికోగదె వేగంబ, నందివాహ.

ఇట్లు,
రచయిత
శీలం వేంకటకృష్ణారెడ్డి.

[వివిధ వృత్తబాల రామాయణ, కందరామాయణ గ్రంథ కర్తలగు బ్రహ్మశ్రీ వేదమూర్తులు సూరివరపు వేంకట శివ సోమయాజులుగారు అనుగ్రహించిన ఆశీఃపూర్వకాశయము.]

# ఆశీర్వచన పద్యరత్నములు

ఉ. శ్రీలలనామనోహరుడు, చిన్మయమూర్తి జనార్దనుండు మా
శీలముకృష్ణయాఖ్యు,ఘను,శ్రీహరుభక్తు,దయాసముద్రునిం
జాలగనిష్టసంపదల సద్గురుభక్తినొసంగి నిచ్చలుం
బాలనజేయుగాక, వరభావకవిత్వవిదుఁడు. బ్రశాంతునిన్

2. కం: రెడ్డికులుండగు బ్రహ్మ
రెడ్డికిసుతుడై జనించి, రెక్కొనుగృష్ణా
రెడ్డినిసతముంబ్రోచుత
నడ్డేమియు లేక, శంభుఁడాదరయుతుడై.

3. కం: వెలవడమన గ్రామంబున
సలలితముగ వెలసియున్న, సాంబుని, రాముఁన్
బలువిధములగీర్తించియు,
నిలజనములుపొగడసతము, నెగడితివౌరా!

4. కం: హరి, హరులకు భేదంబిల
బరికించిన లేదటంచు – బ్రజలకు దెలుపన్
హరి, హరులబొగడి వెలసితి,
గిరిధరుభక్తుండ వౌటఁగృష్ణారెడ్డీ!

5. తేగీ: ఆధునికమగుపద్ధతి, యచ్చువడగ
వ్రాసివినుపించినట్టినీ, పరమభక్తి
యుక్తమౌ కీర్తనంబుల నోర్పుతోడ
వినియునానందరసవార్ధి, మునిగినాడ.

6. కం: అనుకరణ శక్తిపదముల
యనుపమలాలిత్యగరిమ - యర్థవిశేషం
బనునిట్టి సహజగుణముల
గనియుండుట నీదుకవిత - ఘనతకు నెక్కూ.

7. వె: అంత్యనియమయుక్త, మైయలరారెడు,
నీదుకీర్తనముల - నిఖిలజనులు
పరమభక్తి బాడి - కరము నానందంబు
జెందుచుండిరిపుడె, చెన్నుమీఱ.

8. ఆ:వె: భజనకీర్తనముల బాగుగారచియించి
పేరుగాంచినట్టి. సారయుతుని
రామచంద్రుడెపుడు, రక్షించుగావుత
గృష్ణరెడ్డినాము గృపదలిర్ప.

9. ఆ:వె: ధాతనీకొసగుత, ధరణి దీర్ఘాయువు
రాముడెడెడుగాత, రంజనంబు
విశ్వనాథుని దయవిజ్ఞాన, సంపదల్
గాంచివంశవృద్ధి, గనుమునీవు.

ఇట్లు

సూరివరపు వేంకటశివసోమయాజీ

మైలవరం
11-1-56

"పాకయాజీ"
హెడ్ మాష్టర్, బోర్డుఎలమెంటరీ పాఠశాల.

శ్రీ సద్గురుశ్శరణం

[వీరులపాడు బోర్డుహైస్కూలు తెలుగు పండితులగు
మ-రా-శ్రీ చెఱుకుపల్లి సుబ్రహ్మణ్య శర్మగారు దయచేసిన
ఆశీఃపూర్వకాభిప్రాయము]

# ఆశీస్సు

శా. ఓయీ వేంకట కృష్ణరెడ్డి, భవదీయోద్గీతగీతావళి
న్నైయంబున్రసభావనామృత ఝరీపీయూషసంకాశము
న్హాయింగూర్పగవింటి నీముఖమున న్హర్షంబునే బొందితి
న్వేయేలా! పరమాత్మగీతియొకటిన్వేగూర్ప దేహర్షమున్

ఉ. ఆధునికంబులైన వివిధాకృతి శైలులయందుఁ బ్రీతితో
నాధునికుల్కరంబు నొకహాయిని శైలులయందపొంది, ని
ర్బాధరసాదిదీప్తి నొకరైనను,జూడరుహీనదృష్టులై
సాధన జేసితీవలర శైలులలో రసభావనాదులన్.

మ. అరయంబూవులనమ్మువాడు మదిలోనాశించితన్మాల్యము
న్వైరవ్యాప్తంగను విక్రయించునపుడున్నిత్యంబుతద్వాసన
ల్బరిబూర్ణంబుగఁ బొందుభంగి నెపుడు న్భక్తి న్భవద్గీతిక
ల్బరగంజూడెడివారు పొందెదరు కైలాసంబు శైలీరుచిన్ ॥

క. అన్నిటికంత్యప్రాసము
సన్నుతముగఁగూర్చితీవు చతురత యొప్పన్
పన్నుగ లలిత పదంబుల్
చెన్నగు ధారా స్రవంతి చెల్వాలు పొంగన్॥

క. అలవడె కవితా రీతులు
వెలయుంగా నీదు కైత వృద్ధిని బొందున్,
ఇల నెవ్వారలకైనను
నలవడునే దొసగు లేక యచ్చుగఁ జెప్పన్.

మ. అపశబ్దంబులఁ గూడియు న్హరి చరిత్రాలాపము ల్సర్వపా
పపరిత్యాగము సేయుఁ గావున హరిన్భావింపుమీ యంచుఁ నేఁ
సుపరిజ్ఞాత ఘనుండు పోతన మహా శుద్ధాత్ముఁడౌ భక్తుఁడే
విపరీత ప్రతిపత్తి లేక కొలువ న్విష్ణుండు పోషింపడే!

క, దుష్టుడు వెదకును దోషము
శిష్టుడు వెదకంగ నేర్చు శివ భావములన్
దృష్టులు భేదంబగును, వి
శిష్టంబగు భక్తియ నెడి, సిరిశులభంబే।

క. వేంకట కృష్ణారెడ్డీ!
శంకరు నతిభక్తిఁ గొల్చి సంశుద్ధుడవై
సంకట వితతిం బాసితి
శంకర కరుణాప్తిఁ గీర్తి సాధించి తహో!

ఇట్లు, మిత్రుడు,

విరులపాడు,
4-1-56.

చెఱుకుపల్లి వేంకట సుబ్రహ్మణ్యశర్మ,
తెలుగు పండిట్.

# నా నుడి

కాలము భగవత్స్వరూపము. పౌరాణిక గాధలతోఁగూడిన చలన చిత్ర రూపములగు నాటకముల నొక్కరేనియు మెచ్చరైరి. కల్పిత గాధలతోను, అధర్మ యుద్ధములతోను, నొప్పారు చిత్రములను గాంచు వేడుక హెచ్చరయ్యెనుజనాళికి. అది కలికాల మహిమంబుగాక వేరొండుగాదు, సంగీత రసాస్వాదనంబును తదనుకరణంబే. కాన అధునిక సోదర, సోదరీమణులకును, బాల బాలికా తతులకును, భక్తిని ప్రబోధింప నాధునిక గాన కౌశల్యముమీర కొన్ని గేయముల వ్రాయ మనసు వొడమె. కించిజ్ఞుడనగు నే నిక్కార్యమునకు బూనుట హాస్యాస్పదంబును, సాహసంబుననగు. నాయిష్ట దైవంబగు సదాశివుని కృపవలనను, పరమ భాగవతోత్తములును, అస్మద్బాల్య గురువులు నగు బ్రహ్మశ్రీ చెఱుకుపల్లి కనకయ్య మహాశయుల ప్రేరణవల్లను, నా సహోపాధ్యాయు లిచ్చిన యుత్సాహము వలనను, చతుర్వింశతి గేయములనుమాత్రము వ్రాయగల్గితిని. ఇయ్యది తొలి ప్రయత్నము గాన విజ్ఞు లిందలి దోషములను పరిహరించి గుణములను పరిగ్రహింతురుగాక! యని నా వేడికోలు.

ప్రేరకులును, సహృదయులును నగు సహోపాధ్యాయ పట్టమునకును, ఆశీస్సులను, అనుశీలనము నొసంగిన పెద్దలకును, ననుం గని పెంచి యింతవానిం జేసిన భగవత్స్వరూపులైన మాతా, పితలగు శ్రీ బ్రహ్మరెడ్డి, ఈశ్వరాంబలకును, నా హృదయపూర్వక నమస్కారముల నర్పించుచుంటిని.

ఈనా చిన్ని రచనను ముద్రింప ప్రేరేపించి అందులకు వలయు ద్రవ్య సహాయమునొసంగి ముద్రణ, వ్యయ, కార్యభారముల వహించిన కీర్తిశేషులగు కుడుముల అప్పిరెడ్డి మహాశయుల కుమారులగు శ్రీరస్తు చిరంజీవులైన భీష్మారెడ్డిగారికి, వారి కుటుంబమునకు భగవానుడు, చిరాయు రారోగ్యైశ్వర్యము లొసంగి, బ్రోచుగాక! యని ప్రార్థించుచున్నాడను. ఈనా చిన్నిపొత్తము మిగుల వ్యాప్తి నొందించుటకును, చిరాయువగునట్లు జేయుటకును, పరమాత్మ స్వరూపుడును, నస్మదిష్ట దైవంబునునైన శ్రీ బాలకోటీశ్వర స్వామివారి పైభారము వైచెద.

ఇట్లు,

రచయిత.

# విఘ్నేశ్వర ప్రార్థన

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే.

కీర్తన- **1** (యమునాతీర విహారీ-అను మాదిరి)

1 శంభు కుమారా రావా
లంబోదర నను బ్రోవ
అంబా ప్రియసుత దేవ
గణదేవ, దేవ, దేవ. (శంభు)

2 విఘ్నరాజ ఘనతేజ-ని
ర్విఘ్నము లొసగుము రాజ
నేజేసెద నీపూజ
మహా. రాజ. రాజ. రాజ. (శంభు)

3 పిండివంట లివిగోర
వండితి నీకై రాత
దండిగ దిని పోవేరా-నా-
తండ్రి వేగ రారా. (శంభు)

4 పాయస మున్నదిరార
తీయని పండ్లివిగోర
ఆరగించి కడుపార
నన్నాదరించవేర (శంభు)

5 గుజ్జువేల్పు రావయ్యా-నీ-
బొజ్జ నింపుకోవయ్యా
పజ్జ జేరినానయ్యా-నా-
ఒజ్జవనుచు గణపయ్యా (శంభు)

6 మొలకువతో నీసేవ
అణకువ జేసెద దేవ
మూషకవాహన రావా-నా-
భూషలు నీవే కావ (శంభు)

## శారదా స్తుతి

శ్లో॥ శరదిందు వికాస మందహాసాం
స్ఫురదిందీవర లోచనాభిరామం
అరవింద సమాన సుందరాశ్యాం
అరవిందాసన సుందరీ ముపాసే.

కీర్తన- **2** రాగం-కన్నడ-తాళం రూపకం

ప:— అంబ జోహారు-శార-దాంబ జోహారు

అ. ప:— కరుణించు మము గన్నతల్లి జోహారు (అంబ)

మి:— నారదాది మహామునులకును మాతవను పేరొంది
జగమున సాటిలేని యశంబుగాంచిన-నేటితల్లి
జోహారు లివిగో... (అంబ)

చ:- నాదస్వరూపి-నా-మీాద దయజూపి
మోదముతోడ న-న్నాదరించుము తల్లి (అంబ)

మి:- చదువులకు నాధారభూతంబైన నీ మృదు పదము
లను; నా హృదయమందున నిల్పి వేడెద, పాడెదను
పాటలను తల్లి... (అంబ)

## బాలకోటీశ్వర గేయములు

కీర్తన- **3** (రావోయి చందమామ-అను మాదిరి)

పరమాత్మ భవ వినాశా!
పాలించరా మహేశా!

1 పతితపావనుడ వనుచు-
సతతము నిన్నె గొలుచు
సేవకుని బ్రోవలేవా
యేమయ్య దేవదేవ (పర)

2 పరమేశ నిన్ను నమ్మి-
పదములన్ బడితి సుమ్మి
నాపాపములను జిమ్మి
కాపాడ వేగరమ్మి (పర)

3 బాలచంద్రధర లేరా
నీలకంధరారార
చాల వేడితిని గదరా
జాలమేల జేసెదురా (పర)

4 నందివాహనా నిన్ను
నెరనమ్మియున్న నన్ను
కాపాడలేక యున్న
నీబిరుదు లెందుకన్న (పర)

5 వెలవడ పురగిరి వాసా
బాలకోటి లింగేశా
బాలుని "కృష్ణారెడ్డిన్"
జాలమేల పాలించన్ (పర)

**4** (రావే పోదాము-మానసహంస-అను మాదిరి)

రారా పరమేశా! నన్ను బ్రోవ-రా-వేదా సర్వేశా!

1 రారా పరమేశ!-న-న్నారడి సేయకు
చేరి మ్రొక్కితినయ్య-భారమునీదయ్య (రారా)

2 గౌరీ మనోహర-కారుణ్యసాగర
కోరి వేడితి దేవ-దారి దెల్పగ రావ (రారా)
3 గంగాధర హర-శృంగార శారీర
వంగి మ్రొక్కితి నిన్ను-భంగపుచ్చకునన్ను (రారా
4 పన్నగ భూషణ-సన్నుత పోషణ
నిన్నె వమ్మితి చాల-మిన్నకుండెద వేల (రారా)
5 ముక్కంటివి నినునమ్మి-మ్రొక్కులిడితిని సుమ్మి
ఎక్కడుంటివో సామి-గ్రక్కున రా వేమి? (రారా)
6 నాపైన కోపమా?-నావాలి దైవమా!
నాపాపముల బాపి-కాపాడుదయజూపి (రారా)
7 శ్రీశైల మల్లేశ-ఓ సర్వలోకేశా!
కాశీపురావాస-"కృష్ణారెడ్డి" పోష
8 ధర వెల్వడ పురవాస-వర బాలకోటీశ
నెరనమ్మితిధాణీశ-సురవందితసర్వేశ (రారా)

కీర్తన- **5** (అబతేరె శివా...అను మాదిరి)

మహాదేవ శివా...
మహాదేవ శివా, మమ్ము బ్రోవ వేగమెరావ
మాపాలిదైవ మీవెగదా-మహితప్రభావ
1 నిన్ను నమ్మియుంటిమయా-నిర్మలహృదయ-ఓ
కన్నతండ్రి కరుణజూపు-పన్నగభూష
ఓహో-సన్నుతపోష
మహాదేవ్...మహాదేవ్...
మాపాలిదైవ మీవెగదా-మహిత ప్రభావ (మహా)
2 ఘోరములౌ పాపములు-నేరక చేసి-మా

భారమంత నీపై నిడి-చేరి మొ్రొక్కగా
నిన్నే-కోరి వేడగ
మహా దేవ్...మహా దేవ్,..
మహా దేవ మమ్ము మన్నించవ-మధురస్వభావ(మహా)
3 వందనమిదె చేకొనుమా-చంద్రశేఖరా!-ఆ-
నందము సమగూర్చగ మా-ముందుకురావ
చిందులు-త్రొక్కుచు దేవ
దేవా... దేవా...
దేవాది దేవ, దివ్యరూప-దీనమందార (మహా)
4 వెల్వడ పురమందు వెలసి-విలసిత కీర్తి
యిల వేల్పు వై తివయ్యా మాకు-నీలకంధరా
నాపై-జాలిజూపరా!
మహా దేవ్...మహా దేవ్...
మహా దేవశివా, శంకర, మాంపాహి దేవర (మహా)

కీర్తన-**6** (సుందరాంగ మరువగలేనోయ్-అను మాదిరి)
1 కైలాసవాస మహేశా!...మహా దేవ-న
న్నేలుకొనగ యీజాలమ దేల-మహా దేవ...
కన్నతండ్రి నను-కావగరావా మ హ దే వా
నీపాద కమలములను
నేను విడను
నీకు నే దాసుడను (కైలా)
నందివాహనా-సుందర వదనా మహా దేవ-నా....
యందు కరుణ-రా-దెందుకురారా మహా దేవ.....
మందహాస,-నీ-కెందుకు కోపము మ హ దే వ

యేదారి లేదు నాకు
యివే నీకు
నుతులు నను విడబోకు (కైలా)

3 సోమశేఖరా నా మనసారా....మహాదేవ
నిను గొలుతునయ్యా-నను విడవకుమయ్యా- మహాదేవ
నేరము లెంచకు-దూరము సేయకు మహాదేవ
దరిజేర్చుకొనక నన్ను
విడువ నిన్ను
చెడితి నిను గొలువక నే మున్ను (కైలా)

4 వెల్వడపుర గిరివాస యీశా...మహాదేవ...శ్రీ
బాలకోటీశ శ్రితజనపోష...మహాదేవ...
బాలుని "కృష్ణారెడ్డి"ని బ్రోవన్ మహాదేవ
చలమేల సుందరాంగ
భవవిభంగ
భక్తజన బంధు శివలింగ (కైలా)

కీర్తన–**7** (శ్రీ భద్రాచల రమణా-అను మాదిరి)

1 సాంబసదాశివ రారా
శంభోశంకర రావేరా
లంబోదరపిత–జంభారి వినుత
అంబ మనోహర, కంబు కంధరా (సాంబ)

2 భక్తవరద, మహాదేవా, ఆ, సక్తితో
గొలిచెద రావా
శక్తిప్రియ బహు-రిక్తుడ నన్నను
రక్తితో బ్రోవర-ముక్తి నివ్వరా (సాంబ)

3 దండము నీకిదె సామీ. నీ, యండకు
నను చేకొనుమీ
అండపిండ, బ్ర, హ్మాండములందున
నిండియున్న, అ, ఖండ తేజుడా (సాంబ)

4 రాగరహితహర రావా, అను రాగముతో
నను బ్రోవ
నిగమాగ మహిత. అగణిత జనమత
సాగిల బడితిర- వేగమె బ్రోవర (సాంబ)

5 తప్పదు నీకికరారా, నా, యప్ప నన్నె చేకోరా
తప్పులెంచి నను, తిప్పలు బెట్టకు
ఒప్పగ నీపద, మెప్పుడు గొలిచెద (సాంబ)

ర్తన 8 (బృందావన మది అందరిది, అను మాదిరి]

1 పరమేశుండా, పరమాత్మన్
నెరనమ్మిన, నరకము చేరరికన్
పరమపావనుని, పదములు గొలిచిన
దురితము లన్నియు, దూరమగున్ (పర)

2 హైమవతీశుని, నామము దలచిన
తామస గుణములు, తరలునుగా
పామరు లాతని, పదములు గొలువక
తామిస్రమునం బడుదురుగా (పర)

3 గిరిజా రమణుని, మరిమరి దలచిన
దారిద్ర్యము దరి, జేరదుగా!
కోరికతో మన, సారగ వేడిన
భారము లన్నియు, తీరునుగా (పర)

4 ఫాలనేత్ర నీ, లీలలు గనుగొన
జాలను, జాలము. సేయకుమా
పాలశుడను. నీ, పాలబడితి నను
పాలించగ, చల. మేలసయా (పర)

కీర్తన 9 (దేశమును ప్రేమించుమన్నా! అను మాదిరి)

ప. దేవునిన్ భజియించుమన్నా!
అ. ప. దేవులాటలు మానుమన్నా!

చ. 1 దేవునిన్ భజియించకను యే
జీవుడిల తరియించడన్నా!
దేవుడే మనపాలి ప్రభుడని
భావమందున నమ్ముమన్నా! (దేవు)

2 కాయ మస్థిరమైనదన్నా!
మాయలో పడబోకుమన్నా!
ధ్యేయమును విడనాడి. నీవ
న్యాయముగ చెడిబోకుమన్నా! (దేవు)

3 భోగముల కాసించకన్నా!
త్యాగశీలము గాంచుమన్నా!
రాగరహితుని గొల్చుచును, కడు
యోగ్యుడను పేరొందుమన్నా! (దేవు)

4 దుష్టులను దరిజేరకన్నా!
భ్రష్టుడవు గాబోకుమన్నా!
నిష్ఠతో పరమాత్ము దలచిన
కష్టములు కడ తేరునన్నా! (దేవు)

5 తామసాదుల వదలుమన్నా!
పామరుడవై చెడకుమన్నా!
శ్యామలాప్రియు, సేవజేసిన
క్షేమములు సమకూరునన్నా! (దేవు)

6 వింతవింతల రూపుడన్నా!
అంతటా తానిండెనన్నా!
స్వాంతమందున నమ్మువారల
చింతలను కడద్రోయునన్నా! (దేవు)

7 సరసగుణ సంపన్నుడన్నా!
పరమపావన చరితుడన్నా!
నిరతమాతని గొలుచువారల
దురితముల పరిమార్చునన్నా (దేవు)

8 యిలను వెల్వాడ పురమునందున
వెలసి విలసిత కీర్తినందిన
బాలకోటీశ్వరుని దలచిన
కాలుడిక నిను చేరడన్నా! (దేవు)

కీర్తన **10** (వందనమమ్మా-జగదీశ్వరి-అను మాదిరి)

1 మనవి గైనవా-మాధవ దేవ-
మనవి గైకొనవ
మనవి గైకొని నన్ను-మన్నించుమో దేవ
వినయముతో నే ని-న్ననయము దలచెద (మన)

2 కరుణించవేరా-పరమేశ్వర-
శరణమ్మినార

నిరతము నిన్నర-మరలేక దలచెద
కరుణారస సంభరిత-పరమపావన చరిత (మన)

3 కోరితనయ్యా-నీపదములె-
జేరితినయ్యా
యెరుగక చేసిన-నేరము లెంచక
నిరయములనుబాపి-దరి జేర్చు దయజూపి (మన)

4 తల్లివినీవె-ముల్లోకముల-
కెల్ల తండ్రీవె
ఎల్లవేళల నిను నా-యుల్లమందున నిలిపి
చెల్లింతు నీసేవ-మల్లికార్జున దేవ (మన)

5 దిక్కు నీవేరా-ముక్కంటి నీవు-
గ్రక్కునరారా
నిక్కముగ నీపైనే-దృక్కును నిలిపెద
మక్కువతో ననునీ-ప్రక్క జేర్చుకోర (మన)

6 బాలకోటీశ-భవభయనాశ-
భక్తజనపోష
వెల్వడ పురమున-వేల్పుగ వెలసితివి
ఏల యనుమానము విడ-జాల నీపదము ల (మన)

## కీర్తన 11

(నోరు మంచిదైతే నరుడా ఊరుమంచి దేరా అను మాదిరి)

1 శరణుశరణు దేవా-నిరతము
జేతు నీదుసేవ
పరమపురుష నీ-చరణము నమ్మితి
దారిజూపి దరిజేర్చర శంకర (శర)

2 బాలచంద్ర భూష-సద్గుణ
జాల సుజనపోష
అందమైన నీ-సుందర రూపము
యింపుజూపి భవ_బంధము ద్రెంచుము (శర)

3 దిక్కు నీవెసామి-గక్కున
నన్ను బ్రోవవేమి
దృక్కు నిలిపి నీ_ధ్యానముజేసెద
పక్కజేర్చి నా-చిక్కుదీర్చర (శర)

4 వెల్వడ పురమందు_వేల్పుగ
వెలసితి విలయందు
జాలమేల నను-పాలన సేయగ
బాలకోటీశ-భవభయ వినాశ (శర)

కీర్తన **12** (పెడదారి పడకేవో మనసా-అను మాదిరి)

ని. కరుణించుమో దేవదేవా...

అ. ప, నిరతమ్ము జేతు నీదుసేవ...

చ. 1 నిరుపమానంద సంభరితా!...
పరమపావన పూతచరితా!...
ఎరుగనైతిని నిన్ను సుహిత...
శరణమిదె స్వర్గాధినేత... (కరు)

2 దిక్కునీవే యనుచు నమ్మి...
మ్రొక్కుచుంటిని నీకు సుమ్మి...
ఎక్కడుంటివో వేగరమ్మి...
మక్కువతో నన్నేలుకొమ్మి.,, (కరు)

3 నీ పదమెనమ్మి నేనుంటి!..
పాపి నను మన్నించుమంటి...
నీపయినె గురిబెట్టుకొంటి,
ఆపదల దీర్చు ముక్కంటి... (కరు)
4 వెల్వాడం పురవాస యీశా!..
బాలకోటీశ, భవనాశ...
కాలకంఠా కలుషనాశ...
పాలించవేర పరమేశ... (కరు)

ర్తన 13 (అందమె ఆనందం-అను మాదిరి)
సుందరరూప శివా-నా
వందనమిదె గైకొనరావ... (సుంద)
1 మునిజన వందిత రార
కొనియాడెద నా మనసార
వినరా! మనవిని ముదమలర
దీనుడరా, దరిజేర్చర శంకర (సుంద)
2 సురవందిత దురిత వినాశ...ఓ
నెరనమ్మితిరా ధరణీశ
దరిజేర్చుకో......
దరిజేర్చుకో. పరమేశ, మహేశ
కోరితి నీపదముల కోటీశ (సుంద)

ర్తన 14 (ఇంతేనన్నా; నిజమింతేనన్నా అను మాదిరి)
రావేమయ్యా-నాతండ్రి శివయ్యా!
1 రావయ్యా నామొర వినవయ్యా
నీవే గతియని నమ్మితినయ్యా

దేవదేవ నీసేవకుడను నను
బ్రోవకుండుటిది న్యాయమటయ్య (రావే)

2 మృకండు సుతునిన్ బ్రోచిన మతితో
లోకాధిప నామొర విని దయతో
సాకవె నను సజ్జన సంస్తోత్ర
పాకారి వినుత భవ్యచరిత్ర (రావే)

3 దీనుడరా, దరిజేర్చవదేల?
దీనావన నిను నమ్మితి చాల
నిను విడనాడను నీ దాసుడను
నను విడనాడుట నీకిది మేలా? (రావే)

4 కాలకంఠ, సుకుమార శరీర
జాలమేల నను పాలించుమురా
వెల్వడ పురవాసా రావేరా!
బాలకోటి భవభయహార బ్రోవర (రావే)

కీర్తన **15** (బాలాత్రిపుర సుందరమ్మా! అను మాదిరి)

1 పరమేశ, దురిత వినాశ.
నిన్ను-నెరనమ్మియుంటి సర్వేశ. మహేశ
పరమపురుష నిన్ను-పలుమారు వేడిన
కరుణించ రాకున్న-కారణ మేమి? (పర)

2 రాజరాజేశ్వర రార-
తేజో-రూప, హరా! త్రిపుర సంహార ధీర
భుజగభూషణ నిన్ను-భజియింతు నేవేళ
విజయము సేయుమ-నిజ దేవ దేవ (పర)

3 యింతపంత మదేల? దేవా! నాపై
సుంత దయజూపగ దేవాదిదేవ
శాంతస్వరూప వే-దాంత వేద్య ప్రదీప
ఎంత వేడిన చింతదీర్చవదేర (పర)

4 నీలకంధర రావదేలా?-నన్ను
పాలన సేయవు నీకిది మేలా?
వెల్వాడ పురమున-వేల్పుగ వెలసిన
బాలకోటీశ్వర-జాల మేలనురా (పర)

కీర్తన **16** (తరుణులార రారమ్మా-యరమలకృష్ణ-గురు
సేవ జేతామమ్మా-అను మాదిరి)

1 కరుణించ రావేమిరా-పరమేశ్వర
నెరనమ్మి యున్నానుర
పరితినైన ని-న్నారాధించెదనయ్యా
వేరుసేయక నన్ను-చేరదీయ గదయ్యా (కరు)

2 గట్టిగ నీపాదము-పట్టిన నన్ను
పెట్టుటెందుకు ఖేదము
దట్టముగ నాచుట్టు-పట్టియున్నట్టి-యీ
♦ కట్టు, తెగ్రదెంచినీ-పట్టి, నను బ్రోవర (కరు)

3 ఎందుకు యీకోపము-పరమాత్మ-నా
యందు దయను జూపుము
వందనమిదిగో యా-నంద స్వరూప-నా
ముందుకు రార నీ-పొందుగోరితి ధీర (కరు)

---

♦ కామ, క్రోధ, మద, మాత్సర్యములను బంధము.

4 వెల్వాడ పురిమందున—నెలకొని యున్న
మేలైన గిరియందున
బాలకోటి లింగ-యను నామమున, గంగ
నేలిన శివలింగ. నా—పాలి భయభంగ (కరు)

5 ఇష్టదైవము నీవేరా—నీ దాసుడౌ-
"కృష్ణారెడ్డి"ని బ్రోవర
సృష్టికారణ నిన్ను-నిష్ఠతో దలచెద
కష్టములను కడ-తేర్చర, శంకర (కరు)

కీర్తన **17** (రాజా, రారా అను మాదిరి)

1 ఈశా! రారా-పర-మేశా! రార
ఈశ, మహేశ, సర్వేశ—జగదీశ (ఈశా)
నాహృదీ....నీపయిన్...,నిలిపెదరానే
వాసవాది సురార్చితా నీదాసుడను
దయజూపవేరా.... (ఈశా)

2 నేరము లెంచక—దారి జూపుముర (ఈశా)
భారమా....నీకిదీ....గిరిజా మనోహర
కరుణతో నా దురితముల పరిమార్చి
నీదరి జేర్చుకోర.... (ఈశా)

3 నాగ చర్మాంబర—వేగమె రార (ఈశా)
కోపమా...నాపయిన్...తాపసనుతా! భవ
నిగమ సన్నుత, రాగరహిత, పరాకుసేయుట
పాడియటర (ఈశా)

4 చీకటులు నను ముట్టి—చీకు పరచెనుర (ఈశా)
నీకివే...జోతలు...నిను విడరానే

ప్రాకటంబగు నీకరంబున సాకవే నను
లోకనాథా.... (ఈశా)

5 వెల్వాడ పురవాస–బాలకోటీశ (ఈశా)
దృష్టినీ...నీపయిఁ...నిలిపెదరా నే,..
సృష్టికారణ, నీదు భృత్యుడు, "కృష్ణరెడ్డి"
యభీష్ట శిద్ధికి... (ఈశా)

కీర్తన **18** (చెలియ లేదు, చెలిమి లేదు–అను మాదిరి)

1 దేవ దేవ–సుస్వభావ
కావ రావేరా?...,
భావమున నిను నమ్మియున్న–నన్ను బ్రోవుము రా
ఓ–రన్నా రావేరా? (దేవ)

2 మృదువైన నీపద సేవకన్నా, మోదమే లేదు
సతము నీభజనంబుకన్నా, సౌఖ్యమే లేదు
ఇందుధర నీపొందుగోరి–వేడుచుంటిని రా
నా–గోడు వినవేరా? (దేవ)

3 శరణు నీకిదె–కరుణ జూపర–పన్నగాభరణ
దారుణంబగునట్టి, బహుభవ, రోగసంహరణ
నేరముల మది నెంచకను నను–చేరదీయుమ ర
నిను–చేరి మ్రొక్కెదర (దేవ)

4 వెల్వాడంబను పురమునందు–వెలసి గిరియందు
వేల్పులకు వేల్పవై–వెలుగును జూపి ధరయందు
బాలకోటీశ్వరా, యీ–చలమేల జేసెదురా
చాలగ–వేడితిని గదరా? (దేవ)

ర్తన **19** (నమోస్తుతే రఘునాయకా-అను మాదిరి)

నమశ్శివా నను-బ్రోవరా!

6 నమశ్శివా నీ-కోమల పదములు
నీమముతో నుత-వేమరు గొలచెద (నమ)

2 వందన మిదెయా-నంద స్వరూప
బంధములను తెగ-దెంచర, శంకర (నమ)

3 కరుణాభర నను కరుణించుమురా
నిరతము నిను మది-స్మరణము జేసెద (నమ)

4 ఒప్పుగ నీపద-మెప్పుడు దలచెద
తప్పులెంచకు నా-ఒప్పులకుప్పా! (నమ)

5 పార్వతి రమణా-పావన చరణా
పాప విమోచన-పన్నగ భూషణ (నమ)

6 ఫాలనేత్ర శ్రీ-శైల నివాస
జాలమదేల న-న్నేలర యీశ [నమ)

7 వెల్వాడ పురమున- నెలకొని యున్న
బాలకోటి లింగా-భయభంగ (నమ)

8 సృష్టికారణ, హర-రొష్టపడెడు వర
"కృష్ణారెడ్డి"ని-కృప నేలుమురా (నమ)



# రామచంద్ర భజనగేయములు

కీర్తన **20** (రావోయి చందమామ-అనుమాదిరి)

రావయ్యా—రాఘవేంద్రా!
నన్ను బ్రోవ రామచంద్రా!

1 నేజేతు నీదు స్మరణ
నను—బ్రోతువంచు కరుణ
నాపాలి దైవమీవె
కాపాడ వేగరావె (రావ)

2 గజపతి మొరాలకించి
గరుడవాహన మడించి
కాపాడినావు కావా?
కరుణాదయుండ దేవా? (రావ)

3 పాంచాలి భక్తితోడ
పరమాత్మ నిన్ను వేడ
రక్షించినట్టి దేవ
ఈ వేమి? నన్ను బ్రోవ (రావ)

4 భద్రాద్రి నిలయ నిన్ను
భజియించుచున్న నన్ను
దరిజేర్చుకో గదయ్యా
నెరనమ్మి యుంటినయ్యా (రావ)

కీ_ర్తన **21** (పండు దేవదారి పండు_అను మాదిరి)

ప. పన్నగేంద్రశయన రావ
అ. ప. నిన్ను నమ్మియున్న, నన్ను-గ్కన్నన్నబ్రోవ (పన్న)
చ. 1 ఎన్నిజన్మల కైనా-నినేన్న ధ్యానించెద
కన్నతండ్రి కరుణ-నన్నేలరా
ఎన్నెన్నొ పాపముల-నెరుగక నేజేసి
మన్నించుమని నీదు-మరుగు జొచ్చితిరా (పన్న)
2 శ్యామసుందర నీదు-నామమె దలచెద
కామక్రోథము లన్ని-ఖండించరా
నీమహిమలు గన-నే నెంతవాడను
పామరుడను నన్ను-పాలించ వేరా? (పన్న)
3 సీతా మనోహర-పీతాంబర ధర
నాతో మాట్లాడర-నగధీరా!
దాత వటంచును-చేతులు సాచితి
నాతాపముల బాపి-నన్నేలుకోరా! (పన్న)
4 నీలమేఘశ్యామ-నిరుపమ గుణధామ
చాలవేడిన జాలిరా-దేలరా
వెల్వాడ పురమున-వెలసిన శ్రీరామ
పాలించరా నన్ను-పావన నామా! (పన్న)

కీ_ర్తన **22** (సుందరాంగ-మరువగ లేనోయ్ అనుమాదిరి)

1 రాఘవేంద్ర-సద్గుణ సాంద్రా-శ్రీరామా
అఘనాశ, రమేశా!-అయోధ్యవాస-శ్రీరామా

ఖగవాహన-కమలజా మోహన-శ్రీ...రా...మా
నిను నమ్మియుంటినయ్యా
బ్రోవవయ్యా
నేను నీదాసుడ-రామయ్యా (రాఘు)

2 దుష్ట శిక్షణా!-శిష్ట రక్షణా!-శ్రీరామా—నా
యిష్ట దైవమా-యిటు రారమ్మా!-శ్రీరామా
దుష్టుల జేరితి-భ్రష్టుడనైతి-శ్రీ...రా...మా
నా కష్టములను దీర్చి
శ్రమలకోర్చి
నన్ను దయనేలుము దరిజేర్చి (రాఘు]

3 కోప మేలనయ-కోమల హృదయా!-శ్రీరామా నీ
ప్రాపు గోరితిర-తాపము దీర్చర,..,శ్రీరామా
తాపస జననుత-పాప పరిష్కృత-శ్రీ...రా...మా
నీవే యిక నాదిక్కు-
అనుచు మ్రొక్కు-
నాకు దయసేయుము నీవాక్కు- (రాఘు)

4 నీలమేఘ శారీర సుధీర-శ్రీరామా-కడు
జేల నన్ను కరుణించ వదేల-శ్రీరామా
వెల్వడ పురమున-వెలసిన రామా-గు...ణ...ధా....మ
నే వేడుచుంటి చాల
వినవదేల
నన్ను కాపాడగ రావేల (రాఘు)

కీర్తన **23** (యేమయ్యా నా మనవి-అను మాదిరి)

రామయ్యా! నామనవి-యేమా యెనయ్యా—రామయ్యా

4 వేమారు నీనామ-మేపుగ జేసెద
కామక్రోధాదుల-ఖండించవయ్యా-రామయ్యా (రా)

2 తల్లివి నీవే. నా—తండ్రివి నీవే, నా
దైవము నీవేరా-దరిజేర్చవేరా—రామయ్యా (రా)

3 ఎన్నివిధముల నిన్ను—సన్నుతించినగాని
నన్నుకరుణించ వేమన్నా! రామన్నా!-రామయ్యా(రా)

4 కోపమేలర నాపై-తాపస మందార
పాపిపుగోరిన నన్ను-కాపాడవేర-రామయ్యా (రా)

5 ఏదారి లేదునీ—పాదము విడనయ్యా
నీదాపునకు నన్ను—చేదుకోవయ్యా-రామయ్యా (రా)

6 వెల్వడ పురమున-నెలకొన్న, నాయన్న
బాలుడనన్న, నా_గోల వినుమన్నా! రామన్నా(రా)

కీర్తన **24** (రాధాపతే మంగళం-అను మాదిరి)

ప. నమశ్శివా-మంగళం-ఓం
నమశ్శివా మంగళం

అ. ప. మంగళప్రియ, భయభంగ, శుభాంగ (ఓం)

చ! 1 గిరిజా మనోహర-పరమేశ్వరా!
నెర నమ్మియున్న నన్నుబ్రోవరార!
రార, శైకోర, నీరాంజన మిదెర (ఓం)

2 జాలమదేల?–కైలాసవాస
పాలశుడ న-న్నేలు పార్వతీశ!
ఈశా! మహేశా! భవనాశా! సర్వేశా! (ఓం)

3 భవ్యప్రియా–భానుతేజా! హరా
అవ్యక్త నన్నాదరించ వేర
రారా, యిదిగోర, హారతి గైకోర (ఓం)

4 ముక్కంటి నిను నమ్మియుంటి సుమీ
దిక్కు నీవె సామి–దరి జేర్చుమీ
స్వామి, దయగనుమీ, హారతి గైకొనుమి (ఓం)

5 వెల్వడ పురమున–వెలసియున్న
బాలకోటీశ న-న్నేలుమన్నా!
అన్నా! అన్నిటికన్న, మిన్న, శివన్న (ఓం)

మంగళం – మహత్

శ్రీ శ్రీ శ్రీ

ఓ.వె. బ్రహ్మరెడ్డి, ఈశ్వ–రాంబల సుతుడను
చెలుకుపల్లి కనక–యార్య శిష్య
వరుడ, నావిరచిత– "బాలకోటీశ్వర
భజనగేయ" మాల.–పరిసమాప్తి.

కృష్ణారెడ్డి

## —: ఫలము :—

ఆ వె.- భక్తితో నెపుడు-"భజన గేయముల"ను
శక్తికొలది పఠన-సల్పువారు
ఇహ, పరంబులందు-ఇందుధరుని పొందు
పొందగలరు! లేదు-సందియంబు.

రచయిత

కామక్రోధములను-కడకు ద్రోసి
కరుణజూపి నన్ను-కాపాడ రావయ్య
బాల కోటిలింగ-భవ విభంగ.

ఆ. వె. ఇందుధరుడ నీదు-పొందుగోరిన నన్ను
ఎందుకిట్లు వెతల-గుంద జేతు
సుందరాంగ నీదు-సుతుడగానా? నేను
బాల కోటిలింగ-భవ విభంగ.

ఆ. వె. కోపమేల నీకు-తాపసజన నుత
దోషినంచు మదిని-దలచినావ?
"దాసు తప్పులెపుడు-దండముతో సరి"గాదె
బాల కోటిలింగ-భవ విభంగ.

ఆ. వె. భక్తజనుల బ్రోచు-బిరుదు నీకున్న దే!
భక్తి నిన్నుగొల్చు-బాల కవిని
బ్రోవలేక యున్న-బిరుద మెందులకన్న?
బాల కోటిలింగ-భవ విభంగ.

ఆ. వె. వెనుక జేసినట్టి-వేలకొలది పాప
జాలమెల్ల నన్ను-చుట్టుముట్టి
పీడకుండె వాని - కడ ద్రోయవేమయ్య
బాల కోటిలింగ-భవ విభంగ.

ఆ. వె. ఎంత వేడుకున్న-నుంతైన దయరాదు
పంత మేటికయ్య-పార్వతీశ!
వింత గొల్పుచుండె-నీ మనస్తత్వంబు
బాల కోటిలింగ-భవ విభంగ.

ప్రతులు దొరకు ప్రదేశము :-

**S. V. కృష్ణారెడ్డి,**

"ఈశ్వర విలాసము"

వెల్వడం పోస్టు,

(వయా) మైలవరం, (కృష్ణా)

**వెల 0 30**